

# Gajēñdra Mōkṣaṇamu
## గజేంద్రమోక్షణము(1866)

## Yakṣagāna Prabandhamu
### యక్షగాన ప్రబంధము / హరికథ.

Srī Ādibhaṭla Nārāyaṇa Dāsu

# గజేంద్రమోక్షణము.

## హరికథ.

గీ॥ ద్రౌపదికిఁదోడ ! వెన్నలదాపరీఁడ !
కల్మిచెలిఱేఁడ ! బత్తులఁగాచుప్రోడ !
క్రీడిచెలికాఁడ ! గొల్లలకోడెగాఁడ !
నన్నుఁగావుమునీవాఁడ నల్లవాఁడ.

గీ॥ అన్నిటికిఁదుద మొదలయియున్నవాఁడ !
పలుతెఱంగుల నొకఁడవై పరగువాఁడ !
దొరికిదొరకని యట్టులఁ దిరుగువాఁడ !
నేనునీవాఁడఁజుమ్ము నాలోనివాఁడ.

ఖమాచ్ — ఆదితాళము.

ప॥ భావించెదనిను । సుఖంకరా । శుభాకరా । సుధీవరా । జనన
మరణరహిత ॥భా॥

అ॥ దేవదేవపర । త్రిజగదాధారా । భావాతీతగుణ । భాసుర పావన ।
శ్రీవిలసిత కాలవేది । స్థిరచరభూతప్రధాన । కేవల సత్యస్వరూప ।
కీర్తనీయనిర్గుణ ॥భా॥

*ఈ పుస్తకము కంప్యూటరీకరణ మరియు డిజిటైజేషన్ చేసినవారు:*

**తెలుగు సంప్రదాయ కళల పరిరక్షణ సమితి**

**తెలుగు భాష, కళల పరిశోధన గ్రంథాలయము**

ప్లాట్ నెం. 30, రోడ్ నెం. 3, శ్రీకనకదుర్గ గెజిటెడ్ ఆఫీసర్స్ కాలనీ,

గురునానక్ నగర్ మెయిన్ రోడ్, విజయవాడ - 520 008.

సెల్ : 9959517764

౧. నీవేయీజగములు । నీవే యీజనములు । నీవు కానిదేదిలేదు నిక్కమిదియో దేవ । నీవన్నిటి మొలపించెద । నీవన్నిటి సంరించెద। నీవన్నిటి బాలయించెద । నీవే తుజనిలచెదవా నీవే నీకాధారము । నీకునీవె కారణంబు । నీవు నేననెడుభేదము । నిర్మలాత్మ గొట్టుమనుచు ॥భా॥

శంకరాభరణం—రూపకము.

ప॥ శ్రీమహాగణపతినీకు - సేవజేసెదరా ॥ వేమరునీనామములను - వినుతిజేసెదరా । నామదిఁగల కామితములు । ప్రేమనుదయసేయుమనుచు॥శ్రీ॥
వేదవేద్యనిన్ను నేను । వేడుకొందురా । మోదముతో బ్రోవుమనుచు - మ్రొక్కుచుందురా । సాదరముగ విఘ్నములవి - భేదించి కటాక్షింపుము॥ శ్రీ॥

గీ॥ కోరికల కడ్డుదగిలెడు వారిలోన
గొప్పవాఁడవుగాన నిన్గొల్వవలసె
అడ్డుదగిలెడువాఁడెక్కడైనయప్డు
వేడుకొనకేమి చేయుదు విఘ్ననాథ॥

శ్లో॥ మాతఃకృపాతరంగిణి । వికసన్నయనామృతోర్మిశీకరణి ।
సకలజనమోదకారిణి । శ్రుతిసంచారిణి నమోస్తుతే వాణి॥

రూపకము—యదుకులకాంభోజి.

ప॥ తల్లిసరస్వతినన్ను ॥ దయతోజూడవె ॥అ॥ ముల్లోకంబులకువా - ఙ్మూలమైతివె । దయాశాలివైతివెనాతల్లి । శ్రితకల్పవల్లి ॥తల్లి॥
౧. అమ్మానానాలుకతుదయందునిల్వావే । కమ్మనివాగమృత మిచ్చికరుణనేలవే । నినునమ్మితిగదే । మాయమ్మా । బ్రోవుమానా ॥త॥

గీ॥ నాకుమూగిన త్రిలేకుండఁజేసిన
యమ్మనీదయారసమ్ముఁజల్లి
నాదుమాటమెత్తనగఁదీయుగాఁదేట
గా నొనర్చినన్ను గావరాదె॥

## గద్య.

౧. అఖిలభువననిర్మాణరక్షణనిబర్హణధురీణశ్రీమన్నారాయణ దివ్య
చరణారవింద మరందతుందిలేందిందిరాయమాణమానసయుక్తులై
సర్వభూతానురక్తులై జీవన్ముక్తులైన భక్తులు

౨. సంతతతపస్స్వాధ్యాయజపహోమసత్య శౌచదాన దేవ పితృపూజాను
రాగులై సకలసంపద్భోగులైన కర్మయోగులు

౩. నిరంతరనిరవధిక మధురవివిధరస భరితసంగీత సాంగానంగనిగమ
నిరతిశయ పరిచయతరంగిత నిఖిలకలాప్రాభవులై యుభయలోక సా
మ్రాజ్య వైభవులై స్వేచ్ఛావిభవులైనకవులు

౪. సాంఖ్యయోగన్యాయ వైశేషిక మీమాంస శ్రుతిస్మృతి పురాణా
ఖిల విద్యాప్రశంసులై రాజగోష్ఠీవతంసులైన విద్వాంసులు, మఱియు
చిన్న పెద్దలుగల సభ కన్నులపండువగదా॥

శా॥ ఓహోయెంతటి పుణ్యమబ్బెను సదుద్యోగస్థులై మీర లు
త్సాహంబొప్పఁగనున్న వారు మిము శాస్త్రి ప్రౌఢిరంజింప నా
యూహల్ చాలునెకాని బాలునియదృష్టోక్తిన్ ప్రపూర్ణంబుగా
నూహింపంగలవారు పెద్దలని నేనుత్సాహినై పల్కెదన్॥

కేదార — రూపకము.

వ॥ సకలాంతర్వర్తియై - జరుగువాఁడెవఁడో। సకలభూతసాక్షియై సాగు
వాఁడెవఁడో యీ ॥స॥

అ॥ సకలమునకుఁ గర్తయై సకలమునకు భర్తయై। సకలమునకుహర్తయై
సకలముదానై యున్న। యకళంకగుణుండెవఁడో - యనాదిపురుషుం
డెవఁడో। ప్రకృతికిని బరుండెవఁడో - ప్రధానుఁడెవఁడో తెలియుదు ॥స॥

౧. తోఁచితోఁచనట్టులదో - బూఁచిపెట్టునెవఁడో। వాచామగోచరుండై -
వర్తించునెవఁడో। నీచాధికములులేని - నిర్వికారుఁడెవఁడో। వేచర్యల
చేయుచుండు - వేసకాఁడెవఁడో। భూచరులకు ఖేచరభువనేచరుల
దొరయెవఁడో యేచదువుల కందనట్టి - యాశ్చర్యుఁడెవఁడో। తెలి
యుదు॥ స॥ ౧

శంకరాభరణము — సీసార్థము

సీ॥ వృక్షబీజంబులు వెలసినమాడ్కిఁ గార్యంబును గారణమైనవాఁడు
జగములఁబుట్టించి నెగడించి తెగటార్చి సర్వస్వతంత్రుఁడై జరుగువాఁడు
స్థూలంబులందు నస్థూలమై సూక్ష్మంబులందున సూక్ష్మమై యుండువాఁడు
రంగద్ధియును లేక రాజిలు తేజంబు రంగొందు రీతి చెలంగువాఁడు
పరఁగు శ్రుతిగోచరుఁడు భక్తవత్సలుఁడు
దేవుఁడవ్వానిదలచిన దివ్యమైన
జ్ఞానమబ్బును దానిచే జననమరణ
భయము తెగి శాశ్వతంబగు పదవివచ్చు
నిర్మలమైనముదము హెచ్చు
పదరిమనల గన్నవారి మొదటవిన్న
పిదప తెలుసుకొన్న – వెడగుబుద్ధులమన్న
పెదవులను తడపెదరదేలా – యిదియునిజమని యనకపిలా
తుదమొదలు దెలుపు – తొలిచదువులఁ – గదిసి కుదురుగ వినిన
చాలా॥ముదము హెచ్చున్॥

భైరవి — ఝంజాగతి — ఆది

౧. రాజున్నాఁడన – రాజ్యంబుండును – రాజధానియును దనరున్
రాజునకునుమఱి – రాజధానికిని – రాజ్యమునకు బేరొనరన్
౨. మానుగవృత్తులు గుణములువిన్నాలు – మరియునాతనికిజంటన్
రాణులుపుత్రసంతానంబుండును – రహిభటులుందురు వెంటన్
3. అరయఁగమిత్రులు శత్రులుంటిమరి – యాయుధములుచెలువారన్
గురుతుగదేవున కున్నఁటెయీతెర – గునసన్నియుఁబోలుపారున్॥

కాంభోజి – త్ర్యస్రగతి

ప॥ జగంబతనిరాజ్యమా – జగతిహృదయము పురమా । నెగడునదిపి
కుంతము మొద – లగుచెలంగుపేర్లతో । తగునాత్రసాఖ్యలనం-
తములుహరిశివాదులై ॥ జ॥

౧ ఒగిఁబ్రవృత్తి - యునునివృత్తి - యునతనికివృత్తులై । తగురాజస
తామసస - త్త్వగుణత్రయముతనికిన్॥ జ॥

౨ చెలగుభూతశక్తులన్ని - చిన్మయగుచునతనికిన్ । చెలువారఁగ శ్రీభూనీ-
ళలుభార్యలుమరియునీ॥ జ॥

౩ సకలజంతువితతియతని - సంతానంబగుచుగా । ప్రకటముగ త్రికాలం
బులు - పరగుబంటులతనికిన్॥ జ॥

౪ అతులతత్త్వవేత్తలెల్ల - ననుగుమిత్రులతనికిన్ । దెలిసియుదుర్ వృత్తి
తోడ - దిరుగువారుశత్రులై॥ జ॥

౫ వెలయులోకభయకారణ - ములతనియాయుధములై । సలలితంబుగ
దేవుఁడిట్టుల - జగచ్చక్రవర్తియై॥ జ॥

ఉ॥ కోరికఁగల్గువారొరులఁ గొల్వకతీఁదు కొల్వకష్టమౌ
కోరికతీటఁబోలఁ గడుఁగొబ్బునఁ దీర్పఁగొనంగఁ బోవఁబెం
పారుసువంతతోడ నరకటా మరిదీనికి మేరయెట్లునం
సారిగనంగఁ జాలునసిశంబు పరాత్పరువేడకుండినన్॥

సావేరి - త్రిపుట.

ప॥ వానిగొల్చుటతగదాయి - జ్ఞానమిచ్చి కాచిరక్షించెడు॥

అ॥ పూనిమనముపుట్టినయపుడె - మూగగ్రుడ్డి మొదలగువికృతుల।
నానసీకతల్లియయిబెనిచి - జ్ఞానమిచ్చి తండ్రియైమనిచి । మాన
మొసగి భార్యయైకనిచి - ప్రాణభయము బాపెడుప్రభువగు॥ వాని॥

గీ॥ పాముపలనఁబిడుగు పాటునఁ నమారి।
పలనఁబెద్ద రోగబాధవలన।
నలవికానితక్క నాకస్మికంబుల।
వలనమనల గాచువాఁడెవండో॥

గీ॥ పూర్ణచంద్రునందుఁ బొడమిన తేజంబు।
తనదుగతికి నడ్డు దగులువస్తు
వులవెలుంగఁజేయుపోల్కి నజ్ఞానంపు
తిమిరమడఁచునాత్మ కమరుశక్తి॥

గీ॥ ఒకటిసున్నతోడ సుండియెంతయుఁ దన
విలువదానియందు విస్తరించు
కరణినెవ్వఁ డీజగంబునఁ బెంపంది
దీనివిడవితుదకుఁ దానెమిగులు॥

సీసార్థము

సీ॥ తెలికలియెద్దుకన్నులగంతకట్టఁగఁబడి గానుగనకు బూన్పఁబడియొకింత
యుచుదారితో చకయుండియూనెంతయు మునికోలచేదండబాడవంగబండి
చుట్టిసత్రోవనే చుట్టుచుతిరుగ మనమును ఘనమోహమునను గ్రుడ్డి
వారలమైవిధివశమున సంసారమందు పూన్పఁగఁబడిముందలగతి
తెలియకున్నను గాలంబువలనఁ బోట్లు
పడసిచక్రితచర్వణ వర్తనంబు
సలుపుచున్నార మిట్టియజ్ఞానదశను
బొందకుండగఁ నీశుండు
బ్రోచుఁగాన వేడుఁడీ
నీచరితులనాని- నిత్యసంపదమాని
కాచమక్కరగాని - గడుసుతనమూలూని
మోచకంబికనేల గతి - జూచుకొననిదివేళ తడ
వాచరించుటమేల భవ - మోచనం బగుజాల యీశుఁడు॥

కాంభోజి- సీసమాలిక.

సీ॥ పరిపూర్ణుఁడగు బరబ్రహ్మసర్వప్రపంచాకారుఁడై తనయందుదాని
యవతరించుయథేచ్ఛనడఁగు నీజగమెల్లనతనికి నాటపట్టయి చెలంగు
నొకటిసున్ననుగూడియున్నప్పదిగతులందుపోలికమాయనొందియతడు
తోలుతనుబది వేషములఁ జూపునెవ్వాని జాడలజంగమసంఖ్యపెరుగు
గేవలజలచరజీవులలోఁ జేపపదివేషములలోన మొదటిమచ్చు
దీనిరెక్కలజాడనాని పైకెగరెడు పక్షులు బుట్టినాపైనినాల్గు
కాళ్లతో భూజలగతులందు తాబేలు రెండవరకముగానుండు దీని
వలె పంచనఖముల బరగునడవిపంది మూడవయదిదీని మొదలుచేసి

తోకలుగలమృగ లోకమంతటిలోన సింహమునాల్గవ చెల్వతోక
గలుగక చేతులుగాళ్లేర్పడగ బొట్టియగుమేనుగల్గి మాటాడగలుగు
మనుజుడై దవతీరు మరివానికన్న ధైర్యంబుకాంతియు బుద్ధినలరునట్టి
మనుజుడారవపోల్కి జనలోకపాలనదక్షుఁడై యుత్తమోత్తముఁడుగాఁగ
నెగడుభూభర్తయేడగు వేషమదియె వృద్ధికి మేరయంతతో దీసివేత
క్రమముగాసృష్టికి గలుగునెన్మిదియవ వేషముమత్స్యున వెలయుచుండు

తొమ్మిదవరూపువికృత వేషమ్ము మరియు
బదియవదిమ్రగలీఁతో బరగుదుదకు
భూమిఁచరములుజలముల మున్నుసృష్టి
యెల్లయునుదెగుమిగులు సర్వేశుఁడొకఁడు॥

ద్విపద-తోడి-

౧ పతిదూరదేశంబుపట్టినయపుడు
సతివానిచిత్రంబు సరగునదెచ్చి
కనుగొనియుప్పొంగుగన్నీరునించు
గొనియాడుమనవిగైకొనుమని వేడు
నతిభక్తిగొల్చు నాధాయనిపిల్చు
బ్రతిమాలుపదముల పైబడిసోలు
దనగతిగనిపోక ధైర్యంబుదక్క
తనదుసొమ్ములదీయు ధర్మంబుసేయు
బనిమిటిచరితంబు వినిపించువారి
గనిగారవించు సత్కథలనాలించు
నటువలెమనము నిత్యంబుసర్వేశు
బటమునభావించి బ్రతుకుటమంచి.

౪॥ అనఘాత్ములారవినుఁడీ
కననగువిద్యావిశేష ఘనవైభవస
త్యనగరసమాన మీవిజ
యనగరమున విష్ణుదేవు నవతారంబుల॥

సీ॥ తరుచుగనల్లి తామరతంపరగజివురించెడు విద్దెలమించునద్ది
సమదగజేంద్రాశ్వ సంపదనలరారి విజయరామవిభూతిఁ బెంచునద్ది
సంతతరత్నకాంచనముల విలసిల్లి సిరినలకారేఖ నించునద్ది
ఆనందపరవశంబై జగన్నాథ వీక్షణమున నభివృద్ధిగాంచునద్ది
కోట పేటలకును బూవుదోటలకును
నీటుబోటులకతి చిత్రనాటకముల
కాటపాటలకుద్యోగి కూటములకు
నాటపట్టద్ది యవ్విజయనగరమిది॥
గీ॥ తొల్లిగజపతిఁ బ్రోచుట తెల్లమనుచు
నెల్లజనములు నెఱుఁగంగ నిచట వెలసి
కరుణతోడుత నానందగజపతీంద్రుఁ
బాలనముసేయు వేణుగోపాలమూర్తి॥
గీ॥ మొసలిచేఁ బట్టువడినీట మునిగియున్న
గజమును సుదర్శనంబున గాచుశౌరి
మోహమునఁబట్టువడి భవమునమునుంగు
మనలఁగూడ సుదర్శనముననె కాచు॥

మంజరి.

౧ వినుడుపరీక్షిజ్జనవర్యుఁడు శుక - మునినాథునితోననియెఁ
౨ అనఘాగజపతిఁ బ్రోచినాడుహరి - యనిచెప్పితివది తెలియఁగ
3 నీరాటమునకు వనాటమునకుం - బోరాటంబెటుగలిగె
ఘోరాటవిలో గుంజరోత్తమున - కారాటంబెటుదొలగె
బురుషోత్తముచే భూరిదయాకర పుణ్యమైనయాగాథఁ
బురహరసన్నిభ పొందుగ చెప్పవె - పోదోలుదుభవబాధఁ॥
గీ॥ అనిపరీక్షిత్తు తత్కథనాలకించు
కోర్కెచివురెత్త వేడ్కకన్గొనలఁగురియఁ
బూనిసద్భక్తి తొలినోముగాచిపండ
శుకమనః ప్రీతిసేయఁబలికెనతండు॥

## తోడి-త్రిపుట.

ప॥ వినుమయ్య రాజేంద్ర-వేదండరాజరక్షణమ్ము॥

అ॥ ప॥ సనాతనము-సనాకడలి-నినుండెవక-ఘనత్రికకురినాబరగి-ఘ
నాయతియు-నుసున్నతియుదనర్పు చుండునదిమరిన్ । గసక
గిరిన్-గనదుసరిన్-గనన్-జనన్-మనన్-గనంగవలె-
మనంగవలె-జనంగవలె॥ వినుమయ్య॥

౨॥ ధరలోనద్దానినెన్న-దరమా యోరాచమిన్న-కరులబృందముల,
హరులచందముల, గిరులయందముల, జరించుమృగముల,
హరించుఖగముల, ధరించునగముల, దరుల్ దరుల్ దరుల్గ ।
సరవిరిమధువు, లరయుచుదరువు, లరహినిగరువు, లెరుగనిసక,
లరవమధుక, రరుచిరసిక। రరుచిరయు, ధరనదియు। మరివెలయు ॥విను॥

౩॥ చాలాయింపొందు రాజ-చాలనురసాలంబుల। వ్రాలుచుబండుల-
కాలము జేయుచు-లీలనుబల్కెడు-మేలగుచిల్కల్ ।
సోలియాడు కేకిగుంపుల-హాళిమీరియు తేటిసొంపుల-జోల
పాడుగాలిపెంపుల దాళలేక మారుపంపుల-ఖేచరమిథు- నములురతిని-
గరుగుదురు॥ విను ॥

గీ॥ దన్నువెంటఁ దగులుచున్నట్టికోడెఁ జీ।
కటులకెదిరినిల్వకడిమిలేక।
పశ్చిమాబ్ధియందుఁబడె దాగెసూర్యుండు।
కాలమొక్కరీతి గడుపఁగలమె॥

## భైరవి—మంజరి.

౧॥ ఈగిరిగుహాలందిరులు వెరపునను-డాగిప్రొద్దుగ్రుంకినను।
వేగనగుహాలను వెడలెనవగ జెల-రేగి గిరిగహనములను।

౨॥ ఉక్కుమిగిలిమరిలెక్క-కెక్కువయి-పిక్కటిలుచువనకరులు।
మిక్కుటముగదామకార-రడవిని-గ్రక్కునజలిదెమ్మెరలు।

౩॥ విసరముద మొదవ గసిమసంగినలు-దెసలందుల విహారింపన్।
బసమీరంగను బయలువారె సంత-సము లెదలజివురింపన్।

గీ॥ ప్రొద్దువంగుటాకు పోక తరాలెగెం।
జాయుచివ్రురులె త్రైగోయిలలన
జెలగిక పిస్సెజీకటులుబూ చెజాక్కలు।
పై నిజందమూామువంకుదోచె॥

వసంత — రూపకము.

ప॥ కొండవెడలెరా వే-దండతుండములు రాజ॥ కొండ ॥
అ॥ నిండారిన వేడుకల ను-ద్దండ తుండములనూపుచు
చ॥ దండిసింహాశరభములను-దండింపుచుమరి న్నిట
ఖండింపుచు జెండుల క్రియ-దుండములు నెగర్చివైచి॥ కొండ ॥
౧॥ గరుకుగిరులనరసి మేను లోరయు రాయుచు
బొరియలలో దాగు కిరుల-నురుమము సేయుచు
దరిమితరమిగవయములను-బరచి నలుదెసల రవములు । మొరయ
గురియు మొగిలిగముల-కరణిమదములొలుకరహిని ॥ కొండ ॥
౨॥ చిగురుజొంపములును మేసి-చెలువుమీరుచు।దోగరుమా
వియ్యాకులకును-జగడమాడుచు । సొగసుగనొండింటిని
దల-మిగిలి పరుగులిడుచు వెనుది-రిగి యసుంగులను బిలుచుచు
మిగుల నలసి దగనుసొలసి॥ కొండ ॥

భైరవి — మంజరి.

౧॥ ఈగతినరణ్య-మూనినవిధమున-నాగంబులు జనుచుండన్
వేగిరపడి తన-విధివశంబునను-నాగస్వామి ముకుందున్
౨॥ ద్రోవదప్పి నిజ-మూర్గతిసూచక-మౌ వనమును దాగనియెన్
గావలియైయొక-కరేణుకోటి-సేవించుచు వెనుజనియెన్
3॥ పరిణయోత్సవము-ప్రబలు మావి పం-దిరుల క్రింద కూర్చొనియెన్
దరుణులు దానును-ధరణిపీఠమై తసరగనయ్యెడ దనియున్
౪॥ గుజ్జుమావుల కు-గుళ్ళునగ్నియ-ప్పజ్జను సమున్మదమొదవ । సొజ్జగా
గదా-నొయ్యనగోయిల-మొగి మంత్రింబులు చదువన్
౫॥ మాలతీసుమములు-మంజులగతి దల-బ్రాలుగా గురియుతోడన్

బాలశుకంబులు-ప్రముదంబున ని-వ్వాళిపాటలను బాడన్
౬॥ గన్నెలగళమ్ములననురాగ మం-గళసూత్రంబును గట్టన్
దిన్నగ దానభోజనము నళి-ద్విజనికరములకు బెట్టన్
౭॥ వెడలిముదమొదవ-నెడనెడబడతులు-విడెములిచ్చువిధమున
నుదడబడికడువడి దలిరుజొంపముల-నడుగడుగున కిష్వగను

గీ॥ పెండ్లినడకలనడుచుచు బ్రియలతోడ
చిగురుటాకులవిందులు సేసికొనుచు
జెలగిబృందావనంబున జిన్నికృష్ణు
కరణిదానాడునానాడు కరులరేడు॥

చ॥ చనిచనికాంచెనుల్లసిత చారుపయోరుహాసన్మరందఖా
దనమదమత్త బంభరవితానరవ ప్రతిమానగానమా
ననియమితోరుభంగపటునాదమృదంగ రవానుకూల చ
క్రనివహరావతాళ రవరమ్య విశాలసరః ప్రధానమున్॥

వ॥ మరియు నందు జటులవాత ధూతశైవాలజలదభీత రాజ మరాళత్తి త్తపక్షంబులు సితపటచ్ఛాదితోరు తాళవృంతంబులై చెలంగ, సితర క్తనీలోత్పలంబులు విచిత్రదీపంబుల భంగి వెలుంగ, బద్మాంకురంబు లంజెంచువులంద్రుంచి నమలు రాజచక్రంబులు తాంబూల చర్వణా నందకందులైన రాజచక్రంబులుగ విలసిల్ల, దరదరవింద మరందబిం దుసందోహాస్వాదనతుంది లేందిందిర నిస్వనంబు వీణాగానంబయి రాజిల-హారి నీలమంటపంబుపై భాసిల్లెడు దివ్యగాన సభగా నద్దాని బ్రమసి డగ్గరవిమానంబులు డిగ్గనురికి వడివడిదడబడియందుజొచ్చి య య్యారే మోసపోయితిమని తడిసినపుట్టంబులు పిడచుకొనుచు మరల విమానంబుల కేగు కిన్నరకింపురుష వియచ్చరుల కలకలధ్వనులును, గలధ్వనుల మింటికెగసి యుల్లాడుచు బాఠీనంబుల నొడిసిపట్టి తిను నీటి పిట్టలును బెట్టలకై మట్టుమీరి నెట్టనజగడంబుల నెట్టుకొను పొట్టిబా తుల మొత్తంబులును-మొత్తంబులై పైకిదేలి మిట్టిపడు మిట్టలంబట్టి మ్రింగుచు దోబూచిజూపుచు మునింగితేలు కారండవంబులును గలిగి రామాయణ భారత భాగవతామ్నాయంబుల తెరంగున సుగ్రీవహం డవబృందావన మహీమాభిరామంబై-హరిభంగ హరిభంగిసం బారం

భాయుతంబై-రాముగరిమ రాముగరిమ బాలభూబాంకితంబై సుకవి భాషణంబు తెరంగున శ్రోత్రోత్సవంబై-సుందరీరత్నంబు భాతి నేత్ర పర్వంబై-చిత్రిణీజాతి స్త్రీవిధంబున జంచలరసయుతంబై-యోగి హృదయంబు పోలిక గభీరంబయ్యును ప్రసన్నంబై-రాజముఖంబువలెరమణీయంబయ్యును భయంకరంబై-నలుచదరంబై-యత్యులవిస్తీర్ణంబై నెయునప్పంకజాకరంబుం బొడగని॥

కాఫీ—కందార్థము.

విపినంబులోన నప్పుడు
విపులపిపాసాగ్ని చేత వేదనపడుచు న్
లపనములవాడు దీరగ
నపరమితపు నీటిగాలి కపుడానందము బొందెరా
నృపోత్తమా-విను-ము పంకజా కర-ముపైని గని బా-సుహారముగ॥

ఉ॥ ఫుల్లసరోజవాసనల బొందుగ మేయుట చేత మెల్లనౌ
చల్లనినీటిగాలి వెదజల్లగ దప్పినగంబుదీరి తా
నుల్లమునందు సంతసిలి యూథవిభుం డనురాగవృత్తితో
వల్లభలెల్లచుట్టు గొలువంగ సరస్సున డాసి గొబ్బున న్॥

భైరవి—చతురస్రగతి.

ప॥ సరోవరముజొచ్చి మద-కరి ప్రభుడువచ్చి
అ॥ప॥ గరాగరిగనిజ-కరేణువులును-త్వరంబుగానీ-రు రాజిలగబీ-ల్చి రక్తి
నొసగిన బిరానబెనుదగ - దరించిముదమున॥ సరోవరము॥

౧ ద్విరదరాజాతన । కరమునసీరము । దరుచుగబీల్చిదయి । తలకివ్వగ
దరుణులునీటిని । దనివితీరగొని సరసునముదమున
జెరలాడగ । గరంబుముదమున । ధరారమణుడొక । దురాపులను
గూడిరాజితంబుగ । సరః కేళిగొను తెరంగచ్చ్వడ॥ సరో॥

సీ॥ తొండముపై జాచి తోయంబులోపల జక్కగాబానాడు నొక్కమారు
నీరుగలగజేసి నీరజంబులగోసి యొద్దులబడగూల్చు నొక్కమారు

తనకు నెదురుగానకునికి మేనుప్పొంగియొగిఘీంకరించు దానొక్కమారు
దయితలతనవీపుపయి బెట్టుకొనిపెద్దమోడభంగిని దేలు నొక్కమారు
ఒదిగిజలజంతువులబట్టు నొక్కమారు
ఉక్కుమీరుచు గొలువుండునొక్కమారు
సువిదలను రతిదేలించు నొక్కమారు
రంగుమైమున్న మదపుటేనుంగుగున్న॥

లయగ్రాహి.

చారుగతినొడ్డునకు జేరుకొనివృక్షముల
ఘోరముగలాగి జలపూరమునగంతున్
ఘోరమగుతొండమున నీరమునుబిల్చుచు
గభీరనినదంబుపయి మీరనెగజిమ్ముక
సారసరజంబున శరీరమొగిబూయబడ
భూరికనకాచలము తీరున వెలుంగుక
భోరుననుమునింగిపయి మీరుతనచేతనొక
నీరజముబట్టి సొలుపారగనటించుక॥

సీ॥ భూరిభూత్కారసంభూత గంభీరగుంభ ధ్వానమున శైలపంక్తివడక
దారుణవాలసంతాడనోద్ధూతతోయకణంబులంబర మంటికొనగ
నతులహింతాలస్వాగంచిత దేహసంగతి జలజంతు శోణితము వార
ఖరముఖనఖర ప్రకరకంపనంబున గొలనుసర్వమును బంకిలముగాగ
పొంచిమైపెంచి కుప్పించిపొంకరించి
యొక్కమకరీంద్రు డిభరాజినొడసిపట్టి
బాదముహస్తీంద్రుని కెదలోనడరెభయొత్పాదము
గడగడవడకుచు గరేణువులు సందడిబడి తడబడివడివడిబారగ॥
గీ॥ బలయుతుని శూలజాడ్యంబు పట్టినట్టు
లుత్తముని దుష్టకామిని యొడసినట్లు
ధ్యానవంతుని నిద్దురపూనినట్లు
సమదగజమును మొసలివాజాచిపట్టె॥
వ॥ ఇట్లుపట్టిన పట్టుతప్పించి.

శంకరాభరణము - ఆది-

ప॥ దురమొనరించెనాగేంద్రుడు దృఢబలమున - క్రూరమతియైమకరితో॥

అ॥ ధరాధరమువలె । శరీరము మెరయ । గరాగరిగజల
చరేంద్రుడు శౌర్యమున । గరంబున బెనచి । బిరాన విసరగ
కరేణువుల । య్యారె భళిభళి రేయనగ ॥ దుర॥

౧॥ పదపడి రాహువు । భానుబట్టిన । పగిదిని పూర్వపాదముల్
మదమాతమ్మైనయా । మకరియుబట్టిన । మదకరిపశ్చిమపాదముల్
కుదురగదీయుచు । గదసికోటాలన । హృదయము భేదిల
రదములవేయగ । పదలక వాక్చర । మదరుచుదొండము
గదసిగోర । నదిమిజీర జెదిరిఘోర॥ దుర॥

౨॥ కుటిలదంష్ట్రిలబెను - కుంతములవలెను - గ్రుచ్చినీటున మునుమును
బటునఖముఖముల - బరసగు నెమ్ముల - వరకపోల్పుమజిదుమును
నిటునటుదిరుగుచు - జటపటరవముల - బటుతిమియుఘమముల
నటుపోడిమియై చెడ - జతులగిరులవలె స్ఫుటతరరతనువుల
బెటలిరుధిర - మాటుంఝురుల - పటలివెడల॥ దుర॥

3॥ వరనారాయణదాసుని బ్రోచిన - హరితనదెస లేమిని
పరసుజీవమై - మెరయు నా మకరి । కరినిబట్టిగర- కరినిబెట్టగను
ద్వరవిదల్పెబల । మెరయు నా కరియు । కరేణువులు
బిరానగని - కరంబలర॥ దుర॥

తరంగిణి - భైరవి-

౧॥ కరియుమకరియును । గరకరిబెరయుచు । జరిపిరవుడు ఘోరాజిక
సరిబలములరా । తిరిపవలనకను దిరముగనిరువురునోజక

౨॥ వేయివత్సరము । లాయెడదయ్యెక । విగతాశననిద్రలతో
ఛాయనికిన్కల । డాయుచువ్రేయుచు । బరగజయమునకుద్వరతో॥

3॥ చెలగిజీవనము । జీవనముగను మొ । సలికంత బలము హెచ్చెక
అలసియుద్ధమున । నావనకరిమిక్కిలి శ్రమతోడుతనొచ్చెక

౪॥ కరిమకరిదిగుచు । దరికిమకరియును । గరినిదిగుచులోపలికిక
దిరదిరదిరుగుచు - బిరబిరనెడయుచు - నరిమురిగలయుచునలుకక.

లయగ్రాహి.

ప్రళయసమయాంతకుని చెలువునగటాక్షముల
నలఘుచటులాగ్ని కణములు చెదరశూలం
బులవలె వెలుంగునఖముల మకరినాగ
విభునలుగుచును జీరనతడలరు నును కెంబా
ళులమలవలె న్వాలసినిలచి జముపోల్కిని
ముసలినిగరదండమున దలపగుల మోదన్
బలురుధిరసిక్తమయి యాకుసుమితంబయిన
నలలితపు కింశుకములవలెను గనువట్టెన్॥

కం॥ ఈతెరగున మకరీంద్రుం
డేతోవయుగానజాల కెంతయుమదిలో
భీతిగలిగి తప్పుకొనగ
నాతురుడై నాల్గువంకలరయుచునుండెన్॥

సీ॥ కనులనశ్రులు పెనుకాలువులై కారగడగడనొడళులు వడకుచుండ
మానాథురక్షించుమానాథయనిదైవమునకుమ్రొక్కెడుగతిమ్రొగ్గతిల్లి
పోనొల్లగాలేము ప్రాణేశయనుచుమాడ్కి వలుదమేనులనొడ్డవయినివైచి
విన్నబీబలువారవెక్కి-యేడ్చుచుడస్సిపొరలుచుబొరలుచుబొరలుదప్పి
సరసుజొరబోయి చొరలేకమరియు నేయు
పాయమయినను దోచక బాయలేక
నీరునయినను గ్రోలకనెరిగజేంద్ర
కాంతలెంతయు వగలనాక్రాంతలైరి॥

గీ॥ అనుచు శ్రీశుకరుషి జెప్పనాలకించి
తత్తరముజెంది యాపరిక్షిత్తుకనుల
నుత్తరీయంబుకొంగున నొత్తుకొంచు
సవలనేమాయెనన నతడనియెనిట్లు॥

ద్విపద - ముఖారి

సరసులోపల వెయ్యిసంవత్సరములు
సరిగాను మకరితో సల్పెదాటోరు

అంతకంతకు నక్రమధికసత్వమున
వింతసొంపున హెచ్చి వేదనబెట్ట
బహులపక్షపు విధుపగిదిగన్పట్టి
యహమర్ధమగుతరిసలరు మానవుని
నీడపోల్కినిడింది నీలుచుదప్పి
వాడిక్షీణించెనావనగజమపుడు
కాలకింకరుచేత కష్టాత్ముపగిది
జాలరివలబద్ధ ఝషము చందమున
జెలగిసంసారంపు చిక్కనబడుచు
బొలుపుమాలినజ్ఞానిపోల్కిని మరియు
నప్పులలోమున్గు నలతిచందమున
నప్పులలోమున్గి హస్తీంద్రుడపుడు
చెడుగునక్రముయొక్క చేపడికనుల
బుడిబుడికన్నీరు బొడమజింతించె॥

దేశితోడి - మిశ్రచాపు.

ప॥ ఎటువలె నెటువలె నోర్చెదనో। కుటిలవిధినా-కోరకనిర్మించెనాదని॥ నెటు॥

అ॥ పోనియ్యదు-పోరయినమూసదు। కానిదిదయ్యెము - గానసుబిల్చె
ను॥ నెటు॥

౧ జవబలములులే - వు విచారింపగా । నెవరడ్డమింక - యెవ్వాని
గొల్చెద॥ నెటు॥

౨ ఇలదశకోటి - యిభముల నేలుచు । జెలగుచుసుండ కిం - దుల కేల
వచ్చితి॥ నెటు॥

ఉ॥ అక్కట! సర్వసామజకులాధిపుడన్ సతతంబు స్వేచ్ఛతో
దిక్కుల సంచరింతు గడుతెంపున సింహముసైన జూచి పే
రుక్కున మారుకొందును జయోన్నతితో నటువంటి వానిన్
మ్రుక్కడి నీటిజంతువు జముండయితోచె ని కేమిసేయుదున్॥

సీ॥ ఆజ్ఞానువర్తులై యనిశంబు ననుగొల్చు యూధపులిక నెట్టులుండువారొ

కోరి స్నేహము చేసుకొన్న సింహవ్యాఘ్రశరభాళి యికనెంతజాలిపడునో
యింద్రవైభవయుతం త్రికూటంబిక దీనిపాలన మెవం డూనగలడో
నను నెడబాయక పనులెల్ల సల్పెడు భటతతి యెవ్వారి బారిబడునో
అయ్యయ్యో వారెయెడ్డున నడలుచున్న
వారు ముగ్ధలు నాముద్దు భార్యలాక
లియును నిద్దుర లేక నాపయినె చూడ్కి
పెట్టుకొన్నారు తుదకెంతపట్టు నకట॥

ముఖారి – ఆది.

ప॥ ప్రారబ్ధము ననుభవించక – బ్రహ్మకయిన వశమా॥

అ॥ గారింపదా జనకాదులనైన – గరిమాత్రుడనాకాశక్యము ॥ప్రా॥

౧ దండధరుచే మాండవ్యుడు – బెండువడీ కొర్త – దండనుండ లేదా ॥ ప్రా॥

మ॥ ధరణీమండలమెల్ల నేలినను విద్యాసాగరుండైన ద
త్వరసూధ్యుడునైన నెవ్వడయినక్ ప్రారబ్ధముల్ దప్పునా
యెరుగవచ్చెను నాకుజూడు మనుయింద్రద్యుమ్న భూపాలుడక్
గురుశాపంబున నింతవచ్చెనని యూకుంభీంద్రుడూహింపుచుక్॥

నాథనామక్రియ – ఆది.

ప॥ దైవబలమేబలము యోచించి చూడమరి । యేవిధ బలముల – నెన్న నిష్ఫలము॥ దైవ॥

౧ జలచరమెంత దీని – బలమన నెంత । సలిపితి పోరు వెయ్యి – సంవత్సరములు॥ దైవ॥

౨ ఇలదశకోటి – యిభము కేలికనై । జలచరమున నే – జావసలసె దుది॥ దైవ॥

కందార్థము – కేదార.

చేయగలయంత మట్టే
నీయెడ జేసితిని జేవయిక లేదుకదా

జాయుత గోత్సేద శ్రీనా
రాయణామహూర్జితచరాచ - రాంతరవర్తీ
భూచర దుష్టాంతకస్ఫూర్తీ
సంతతవిబుధప్ర - స్తవనీయకీర్తీ
శాంతదయారసపూర్తీ - భక్తలోకాంతరవర్తీ॥

మ॥ స్మరియింతున్ జగదుద్భవస్థితి వినాశప్రక్రియా ప్రాభవ
స్ఫురదజ్ఞానవిహీన శంకరముఖామర్త్య శ్రేయోగణ్యు ను
త్తరజస్తామస సత్త్వభాసుర గుణాఢ్యుఁ దత్త్వవిచ్ఛక్తి కి
ర్వరుఁ బానిని వేదవేద్యుని దయాశాలిన్ భవచ్ఛేదకున్॥

బలహంస - మిశ్రచాపు.

౧ ప॥ స్మరియింతుమదిన్ । పరమేశ్వరు శం - క శాశ్వతు నీ - శ్వరు
అ॥ విశ్వమయున్ । నిరవద్యు నిరం - కుశు సత్త్వపరున్ । పరమాత్ముని రక్షకు
భూతకరున్॥

౨ జగదుద్భవ పాలన నాశకరున్ । నిగమేద్యుని రంజను నిత్యపరున్
స - త్త్వగుణున్ పరిపూర్ణు నిరామయునిన్ జగదంతరవర్తప
శక్తియుతున్ ॥

౩ అణురూపుని స్థూలుని దత్త్వమయున్ - జననంబును నాశము లేని
విభున్ । ఘనునిర్మలు నచ్యుతు నాదిగురున్ - దనయందనె కల్గెడు
నిర్గుణునిన్॥

మధ్యాక్కర

అతఁడిట్లు నిర్గుణ బ్రహ్మమాత్మలో నిలుపుచుండ
స్తుతిజేసి యంతతోఁదుష్టిఁబొందక యాతురతఁబొంది
చతురత్వమూని సర్వేశునంతటన్ సగుణుజేసి
యతిభక్తితోఁ దపర్ణించె సంతసంబతిశయిల్ల॥

కేదారగౌళ - అటచాపు.

ప॥ స్మరియించెద కృష్ణున్ । ఘనరోచిష్ణున్॥ స్మరి॥

అ॥ పరిహృతతృష్ణు | సుగుణవర్ధిష్ణు | పర కౌస్తుభాలంకరిష్ణు
విష్ణు జిష్ణు॥

మిశ్రం॥ చరాచరములలోన వెలుపల-జరింపుచు నుభయంబు దానై | స్థిరం
బగు ఘనమాయకును దా-బరుండౌ పరేశుని బరముని॥

౧ అలరులోకములు నం-దుల కీశ్వరులతో | బ్రళయము నొందిన వేళల |
దలంపగ జెంజీకటికిన-వ్వల బలు తేజము నదాని | శ్చలంబుగ బరి
పూర్ణుడై [illegible]-వెలింగెడు [illegible] | స్మరియించెద నే కృష్ణు॥

౨ పదపడి నర్తకు - భంగి బెక్కు మూర్తుల - బరగు నెవ్వడు లీలతో |
దిదృక్షులు మునులును సర్వను - హృదుల్ సాధులు భక్తులును నిజ
హృదబ్జములను గొల్తు రెవ్వని పదబ్జము - లెదన్నాతని॥ స్మరి॥

౩ గుణజన్మకర్మరూ - పనామభేదము లె - వ్వనికి లేక జగముల | సునిర్మిం
పుచు లయము చేయుట - కై యిన్నియును దాల్చు నే ప్రభు | వు నే
నతని ననంతశక్తి నాత్మ - రుచి నధ్యాత్ముని॥ స్మరి॥

౪ దెసలేని నాబోటి - పసులపాపము - ల సమయించెడు దేవుని
ప్రసాదిత నిజసర్వదా - న సంఘుని బహుభూతతతి - ర్మసాక్షి నవ్యక్త
నాద్యు సర్వాత్ము లోకేశుని॥ స్మరి॥

౫ ఎరుకకు మాటకు - నెదకునందగ రాని-యీశునన్ మహేశునన్ హరిన్
జిరంతను విజయనగరవా - సురక్షిత నారాయణదా - సు రాజిత
వేణుగోపా - లురమ్యు నగమ్యు శరణ్యు॥

చ॥ జలధులు రోమకూపములు శల్యము లద్రులు సూర్యచంద్రుల
క్షులు పవనంబులూర్పులు శుక్లము వర్షము మిన్ను శీర్ష మి
య్యిల జఘనంబు మేనుజగమెల్లయునై వెలుగొందు నే విభుం
డలఘు డనంతు డవ్యయు డనాదిగురుండగు వాని గొల్చెదన్॥

గీ॥ ఇట్లు కరిరాజు హృదయ మందీశు నిల్పి
తన్మయత్వముతోడుత దలచి తలచి
మకరి తన దేహమందలి మాంసమెల్ల
యొలుచుటలు జూచి యాబాధ కోర్వలేక॥

శా॥ ఆపత్కాలమునందు భక్తులు మొరో యన్నప్డు రక్షించుగా
శ్రీపాలుం డిపుడేను భక్తుడను శౌరి బ్రాణవేయన్న నా

పాపంబా నను బ్రోవకుంట యిది భావ్యంబా తలంపంగ లే
దా పాలింపగ బుద్ధిపుట్ట కిటు రాడాయంచు నూహింపుచున్ ॥

### సావేరి - త్రిపుట.

ప॥ కలదు లేదని సందియము వలదె వలదె మనసా ॥

అ॥ పొలుపారగ కారణం బలరక యీజగ మెట్లులవచ్చెనని యెం
చవా యోచించవా ॥

మిశ్రం॥ పలువర్ణంబులగు నీలతాదులు బలుకొండలు నదులు సరస్సులు
నెల్లజంతుజాలంబు లెవనితలపున గలిగెనట్టివాడు ॥క॥

౧॥ చుక్కల తేజము సూర్యుని యోజము మిక్కిలి జేయుచు-మెల
గువాడెవడో । దిక్కులన్నిటికి దా-దిక్కైనవాడెవడో
యెక్కాలములు లేక-యేపారు నెవండో । అక్కరయొక్కింతయు లే-
కన్నియుగావించునెవ్వాడో । యొక్కడయ్యు బెక్కుగతుల దా-
నొప్పుమీరునట్టి సర్వేశుండు ॥క॥

### కందుకవృత్తము.

వెలయుననాదిగ బెంపలరారెడు వేదము దబ్బర పల్కెడునా
సలలిత భంగిని శాస్త్రములెల్ల నసత్యపు పద్ధతి దెల్పెడునా
కలదు కలండని కారణకార్య వికారుని బెద్దలు గొల్చెదరా
పలుమరు నాపదపాల్పడి భక్తులు భక్తశరణ్యుని బిల్చెదరా ॥

### ఉత్సాహ.

ధరణినాథ వినుము మిగుల దంతివిభుడు నాత్మలో
సరసిసంశయమును దొరగి యార్తనిరతుడైన శ్రీ
హరిజగన్మయుడును బరుడు నవ్యయుండునై తనున్
వెరపడంచి మనుచు ననుచు బిల్వదొడగె నిట్టులన్ ॥

### కేదార — చతురస్ర.

ప॥ సకలభువనపాలనా-సాధుయోగిభావనా । యకలంక కౌస్తుభాంక
యయ్యా రక్షించరా-యో దేవా నన్గావవే రావా॥ సకల ॥

౧॥ చెడుగు మొసలియంటెరా-కడుగ్రసించియుంటిరా । కడగితోడు
నీవవలెను విడువదేమి సేతురా॥ సకల ॥

౨॥ విజయనగరపోషణా-సుజనహృదయభూషణా। ధ్వజశాయియా
నారాయణ-దాసచిత్తతోషణా॥ సకల ॥

మంగళమహాశ్రీ.

అన్నవిను నీవలననన్నియునుగల్గి తమయందౌదవుకర్మములచేతఁ
గొన్నిదినముల్ చెలగికుందు సుఖదుఃఖములగ్రుంకువడినిండెలియలేకన్
నన్నువలెబామరు లనారతము కిల్బిషమునంబడి నినుం గొలువబోకఁ
ఖిన్నులగుచుండ్రు కడుగీర్తిగొని నీదయునకింకరులు ముక్తులగుచుండఁ॥

మ॥ పతితుఁ బావనుఁ జేయు నీబిరుదునిల్పంబూను చోనాపదఁ
బతితున్నందగఁ బ్రోచి నిల్పుమటులం బాలింపలేవేని యా
తతచంద్రాతపకీర్తి బోవునుసుమా తథ్యంబటుల్ పోయినఁ
జతపెట్టంగను నీతరంబ యిక కృష్ణా వేగ నన్ బ్రోవరా॥

కమాచి — చతురస్ర.

ప॥ ఎవరున్నారునన్నుబ్రోచువా-రినకులచంద్ర శ్రీరామచంద్ర ॥యె॥
అ॥ అవనిలోనిన్ను మించు-నార్తశరణ్యు లింకెవరున్నారు॥
౧॥ తెలిసియుదుర్వృత్తినిజరించి య-శ్వాలదిగులొందునావంటి
పామరుల॥ కెవరున్నారు ॥
౨॥ కాలముగడువదు-కర్మముతీరదు । కాలునివలె న-క్రమునను బట్టె ॥నె॥

మానినీవృత్తము.

ఆపదబుట్టినయప్పుడు నీపదమందలి కోరికయబ్బినచో
బాపములెల్లయుబాసి విపద్దశబారునటంచును బల్కెదరీ
యాపదబొందితినార్తిని గుందితి హాపరమేశ్వరయంచునినుఁ
వేపలవించితివే సరియుండితివేగ హరీగనుపించవొకో॥

మ॥ నిరతంబున్ భవదీయపాదములనే నెర్పొంది నేబట్టితిం
క రయంబొప్పగ బ్రోవమంచిదిగదా కాకున్న నేనేమనం

దు రమాధీశ్వర భక్తశిక్షకుడుగా దుర్వార్తనీమీంద నా
పరివారందరు నాడుకొందురిక గృష్ణా వేగ నన్బ్రోవరా॥

హరికాంభోజి—చతురస్రగతి

ప॥ ఎందుకు నిర్దయ - యొనరున్నాడు రామ । మందుడనై కడు - గుండె
దునాపై ॥ఎందు॥

1. ఆపదగలదా - నీపదభక్తుల । కాపన్న-రక్షాపరుడవుగదనీ ॥ఎందు॥
2. శ్రీహరినీపద - సేవకు నిట్టుల । గ్రాహము బట్టిన - కారణ మెంచవ
॥యెందుకు॥
3. తనువులు జెల్లుచు మాటనిలచును । దసరనారాయణ - దాసపోషనీ
॥ఎందు॥

తరళవృత్తము.

ఇటులగజ విభుడు విధిదనయొడలగరుణ గానుచుదా
గటకటబడి గనియయుగము కరంగిగడుపుకొనుచు ను
క్కటముగ మొసలితనకిడుము గడలు కొలుపమిగులవే
సటనుబొగలి హరినిదలచి సలిపెబరుసములు నృపా॥

మ॥ నినునెంతో బహుబంటపంచు మదిలో నే నెంచితింగాని నా
కనుమానంబికదీరె నేమనిననత్యాపన్ను నీభక్తునిన్
బెనుబాముల్బడబెట్టుచున్న ఖలుదోర్వీర్యంబుజక్కాడకిం
టనుదాగుంటివొ వెన్నదొంగవయి కృష్ణా వేగనన్బ్రోవరా॥

కాంభోజి—చతురశ్రగతి.

ప॥ ఇంతచేతకానివాడవా - యింకదెలిసెనీఘనత
అ॥ప॥ కంతుని నీసుతుని - గనుక నేగా శివుడుగాల్చె ॥ఇంత॥

1. అలనాడునీతండ్రి - యిలువెడలగొట్టగా - దొలగిబంగారువంటి నీ
యాలిని - దొంగపాలుజేసితి ॥ఇంత॥
2. ఒకనాడునీతల్లి - యొగిజెరబడెరా । యొకనాడునీతండ్రి - యొగిజంప
బడెరా । ఒకనాడునీచెల్లె - లొగిసభకీడ్వబడెరా॥యింత॥

3. విజయనగరగోపాల – నినుసీకు బీరమున్న। గజిబిజిమాని భక్తుని గావరా ॥యిం॥

గీ॥ ఏమిదురవస్థవచ్చెనో స్వామినీకు
రావదేమిరభక్తుని గావవేగ
పరగరావేనినోటికి వచ్చినట్టు
లాడెదనునన్నుమ్మ దొరవని దూడఁబొమ్ము॥

దేశి — అటచాపు.

ప॥ ఏమిటికింక రాపీ – వెందునదాగినావు

అ॥ప॥ నీమహిమఁ జేసినావా – నేరములెంచినావా ॥ఏ॥

౧. ఆపదతటస్థించెనా – యప్పులను నిగిపోతివా। వీపునగొండబడెనా – వెతలనొంటరివైతివా ॥ఏ॥

౨. బలుకంబమునగట్టిరా – బలికై యొప్పగించిరా। అః నిజజనకుజంపిరా – యాలినిజెరగొనిరా। కల్లుముఁద్రావినావా – చెల్లెలనవమానించిరా। కాళ్లుసేతులుఁ లేవా – కళ్ళెమునోటనిడిరా ॥యేమి॥

3. దూషణజేసితినని – దోషములెంచకుస్వామీ। పోషణజేసినగాని నీకవెపదివేషముల – వుపోనీ ॥యే॥

౪ ఎంతనియోర్తు నీబాధ – జింతలుదీర్పరాదా। సుంతయు దయలేదా – పంతమాయెనా నామీద॥ యే॥

౫ విజయనగరపాలా – కాతలనుబావవేల। విజితదుష్టశీలా – వేణుగోపాలబాలా ॥యే॥

గీ॥ తల్లిచనుబాలుఁగ్రోలెడు తరిని బిడ్డ
కరిచిన విదల్చు తల్లి చికాకుతోడ
గావుమని మరి బాదిగిటగదియుగాని
పోగలదె బిడ్డయెందైన నాగళయగ॥

స్రగ్విణి.

ఏలరాజాలి లేదేల రాజాల మిం
కేలరా నాకుదిక్కేదిరా సక్రమున్

దూరలగా గొట్టి నాదుఃఖమున్ మాన్పరా
బాలగోపాల నీభక్తుడగ్ బ్రోవరా॥

తోటకవృత్తము

అనుచున్ గలభేంద్రుడు నాతురుడై
వనజాక్షుడు బ్రోవగవచ్చు దృఢం
బనుమానము లేదని యాత్మను ఖే
దనిరూపణ సేయక తత్పరుడై॥

స్రగ్ధర.

దివికిన్ దొండంబుజాచున్ దెసలఃమ్మ్రగసమ ద్దివ్యనాదంబువించునీ ।
జెవులన్ రిక్కించు నాశన్ జెలగెడునయన శ్రీలు దాగుంటబర్వాన్
రవిసంకాశ ప్రకాశారహితనను మనుపన్ రావె శ్రీకృష్ణయంచున్
దివిభేదిల్లగ నార్చున్ దృఢతరముగ నాదిగ్గజాభేభమప్డున్॥

పాదపము.

వెన్నునిదాబల వించుటచేతన్
గన్నులగట్టిన కైవడిదోపన్
సన్నుతిసేయగ సామజమప్డున్
విన్నుమొగంబయి వేయిటుపల్కెన్॥

ధన్యాసి - రూపకం

ప॥ అదోవచ్చెశౌరి బ్రోవ॥ వదో॥
౧ పారరహిత కరుణను గురియుచు మరినామొరను విని సరగున మ - క
రీంద్రుదరుగ నిప్పుడల్లదో॥
౨ సిరిన్మొరయు పె - న్నురంబుతో బరి - పరిన్ హరిన్ గరిన్నిగడు
మధ్యాగ - తిరంజిల - గరంజత - పురంజను॥ వదో॥
3 గానమునల్పుచు వేల్పులువెన్నుసగా నభమంతయు దేజముగా ద్వారగా॥
అదో॥

మహనవృత్తము.

ఈరీతి గొంతతడవా యిభరాజుమాయా
కారము జూడనదియున్ గరిబోలిపోవన్
ధీరత్వమున్ గడి యతిడెద్దియుదోచ కీశున్
జేరంగబూని తిరివచ్చెనటంచు వేడెన్॥

శా॥ అన్నా బ్రోవుమటంట బ్రోవకను నీవాలస్యమున్ జేసినన్
నన్నీపాపివధించునంటి ద్వరగానం బ్రోచినన్బేరు క
ద్దన్నా యంటి స్మరింపుచుంటి గడుబాధ న్నిల్వలేనంటి నో
జన్నన్ గావు మొరోయటంటినిక కృష్ణా వేగనన్ బ్రోవరా॥

వరాళి – యేకతాళము.

ప॥ ఇంకనైన బ్రోవవేమయ్యా – యీబాధకెట్లోర్తురా। పంకజాత
నయనా – పాలింపరాద॥
మిశ్రం॥ శంకరాదిదేవ సంఘనుత పద – పంకజాత సాధుబృంద పాలన
శంకలేల దాసునింక బ్రోవగ – బింకమటరజంకులటురసంకటహరా॥ఇంక॥
౧॥ కడునవయువములనొచ్చెరా – గడగడనొడలు వడకజొచ్చెరా॥
బడలికనిలువగజాలవు – ప్రాణములన్నియు జీవముగడచిన కడపట
నెవరిని – గాచెదవోయీ చనునోయీ రావోయీ॥ ఇంక॥
౨॥ వరనారాయణదాసా – వరుడౌనని నినునే – గరముస్మరియించితి
నిగదరా। నిరంతరమువిజయనగర – వరంబునను వెలసినసామిగార
గోపబాల యుదిత – గురా సరిసరిరా మనువవురా త్వరగ॥ ఇంక॥

మ॥ ఒడలెల్లన్ వడకంగజొచ్చె నికగాలూనంగ లేనీయెడన్
గడుమూర్ఛన్ స్మృతిదప్పె బ్రాణములు నాకంఠంబులో దల్లడి
ల్లెడురా వచ్చిబిరానబ్రోవరహరీ యీశా హృషీకేశ నా
జడుపుందీర్చర ప్రాణముల్ నిలిపి కృష్ణావేగనన్ బ్రోవరా॥

తరువోజ.

అనియిట్లుకరిరాజు హరినిబ్రార్థించి
జీవంబుపైనాశ జేయకనాయు

వునుబంధనము జేసి మోక్షణోపాయ
మునకయి చింతనమును జేయునప్పుడు
వనజాక్షుడంతట వైకుంఠమందు
శ్రీరమా దేవితో జెన్నారుచుండి
మనుపవే యోదీనమందారయనెడు
భక్తుని మొరవిని పరతంత్రుడయ్యె॥

హాయుగతిరగడ

పరవుగాదెటకొండ బోలినపానసేనికి మీదగ్రొ
మ్మెరుగుతోడ వెలుంగు నల్లనిమేఘమనజెన్నారి శ్రీ
హరిజగన్మయుడాది పూరుషుడాత్మవల్లభతోడ భా
సురముగా నరమోదమ్మునకున్న త్రొక్కియుండెడు వేళ వి
హ్వాలగజేంద్రము పాహిపాహి దయాపయోనిధి భక్తవ
త్సలహరేయను నార్తరావము చాలదిక్కులనిండి
గొబ్బుననెడన్ దిగులుపడవినబడ బోదలుసెనరుల పెంపుతో
బల్చునివిడెవు చిరుకెంపుతోడ నొసటజెదరునెరిగుంపుతోడన
బుడుతనూతను బడినసుడివిని పొలుపుచెడి పరుగిడుజనకువలె
గడిగెత త్తరపాటుతో గనుకడల వెడవెడపాటుతోడన
యొడలి చెమటలనీటితో నెదనుబ్బుగుబ్బలపోటుతో గడు
నడరుపెదవినిగాటుతో జీరాడుపై వలెవాటుతో మయి
గడనుగుంకుమ తేటుతో వెనుకడను కీల్జడవేటుతో మండి
వడెడుభూషణకోటితో గొనవంగుచిటికెనగోటితో మొల
నడలుకనకపు శాటితో వెజ్జనెడు చక్కనిబోటితో
వెలువడియె గేళిగృహంబు వెన్నుడు భక్తరక్షణలోలుడై॥

సీ॥ అంసభాగంబున నాడెడుగొప్పకొప్పున సన్నజాజులు వుడమిరాల
జిన్నికెంజాయ వాల్గన్నులు కమ్మల దివిటీలమును నటులవిధమొప్ప
హారికరాకృష్టచేలాంచలంబుననీవియందున బాణిద్వయంబు మెరయ
మోము వేకువచంద మూమపోల్కినివెల్గనధరంబుపై గెంపులలరుచుండ

కాపిపావడజీరాడ కాంచివీడ
కౌనుజవ్వాడ నారదమానిపాడ
మేచకముతోడ దొల్కరి మెరుపుజోడ
నేగుదెంచెను లక్ష్మీసర్వేశునీడ॥

మారువ- చతురస్ర

ప॥ గజేంద్రరక్షణ కొరకై చెన్నుడు - కడుపడిగ బయలుదేరెన్ । అజ
ప్రముఖ గీర్వాణుల్వెను జన - నాతురుడై యార్తావన పరుడై ॥ గజే॥
౧. అతనివెన్కసిరియాయమతోడుత - నవరోధవ్రాతంబుల్ । జతు
రుండౌ పక్షీంద్రుడు వెంటనే - శంఖశార్ఙ్గ చక్రాయుధములతో॥
౨ వీణబట్టినారద మానీంద్రుడు వేడుకతో డనటింపన్ । ఆనబెట్టినట్లు
వికుంఠమునం - దాబాలగోపాలము వెనుజన॥ గ॥

కవి రాజవిరాజితము.

అపుడువియత్ పదమందున జందురుడాడుచు జుక్కలతోఁ దివికిన్
విపులముగాదిగుచుండెడుశేరునశిష్టునితోడ సము న్నసుగల్
చపలవిమానములంజను దేరగసంభ్రమము నావలతోడ జెలం
గుపగిది నాకసమంతయు బొల్చెనకుండలికే తేజమునిండునకొనన్॥

కేదార- కందార్ధము.

ఇటులవతరించి గనియె గ
పటనాటకుడంత నక్రపటునఖరము ఖో
త్కటజాలమందుదిక్కిలి
గటకటబడువానిభక్తి గడగెడువానిన్
దన్నుముక్తి - నడిగెడువానిన్
విగతశక్తి - నడరెడువానిన్
ప్రాణాసక్తి - విడనాడువానిన్
గడగడవడంకుచుంబొరిబొరి - గావవే యార్తబంధోయని
బెసిదపుటెలుంగుతో దన్నుం - బిలుచుచుండెడు నేన్గురేనిన్॥

### మంజుగతి - భైరవి

౧ ఈవిధమున నార్తావనుడౌ హరి - యిభరాజదశను జూచి । కావ
బూని చక్రము చే నక్ర - గ్రీవమ్మును దెగవైచి॥

౨ చల్లనికరమున సామజేంద్రుశిర - మల్లన నిమురగ జొచ్చెన్ । సల్లలితం
బుగ శక్తి వచ్చిగజ - వల్లభుడక్షులు విచ్చెన్ ।

౩ ద్విరదరాజటుల దెమ్మ దేరిగని - గరుణారసపరిపూర్ణున్ । మరకత
కుండల మండితకర్ణున్ - స్ఫురదంబుదనిభవర్ణున్ ।

౪ గాంచనచేలున్ గానవిలోలున్ - జంచదలకయుతఫాలున్ । సంచకిత
దనుజజాలున్ శ్రీభా - మాంచితుడౌ గోపాలున్॥

ఉ॥ అట్లుగజాధినాథుడు మహాప్రభు తేజము కన్నులందుని
ర్మిట్లాదవంగ గాంచి మితిమీరిన వేడుకతో బ్రియాళినల్
దట్లురమాకటాక్షము కతంబున గ్రుమ్మరుచుంటజూచి య
ప్పట్లనె దేవదేవుని ప్రభావము వర్ణన జేసెనిట్టులన్॥

### ఆరభి - రూపకం

ప॥ దేవా నేధన్యుడనైతినీ - నీపదొరికెరా నా - చింతదొలగెరా॥ అ॥
భావింపగనీపాదాబ్జ యుగము - నావంటిపామరులకబ్బునా

౧ దానవకులనాశన బిరుదా, తనువిజితనీలశరదా విబుధాసనుడవై తివిశదా
విజయనగరేశ॥ నీసేవ॥

### దండకము

జయజయసర్వజ్ఞ సర్వేశసర్వాంతరాత్మా విరాట్పూరుషా విశ్వ
రూపా నిరూపాపరంజ్యోతి సత్యస్వరూపా జగద్దీవనిన్ను న్నిరూ
పింప శక్యుండనే భిన్నుడన్ జిన్న యుష్ట్రేమునిన్నంటిగాబోలు నా
పిమ్మటన్ బెద్దనై యన్నియుం జూడగా బాలుదంచున్నదు న్గర్వినై
యుండగా స్వప్నలీలన్ సమస్తంబు గన్పట్టుచుంబోవుచు న్నారడిం
బోలిక న్మాయజేయంగ నాకెద్దియు న్నిక్కమై శోచకుండైన్నదా
నేడు నాపూర్వ పుణ్యంబునం గల్గు సద్భక్తిభావంబునన్ సత్య
రూపుండవౌ నిన్ను నేగంటి సంతుష్టిగొంటిన్మరి న్నందియంబూడె

నాయన్న నీకన్న వేరున్నదే నిర్గుణాద్వైతమూర్తీ దయాపూర్తి
విస్తారకీర్తీ ననుంబోలుమూఢు ల్భవంబంది తాపత్రయాభీల
కాలాగ్నికీలావళి న్మగ్నులై యంతమున్గానలేరో మహాదేవ నీదా
సులౌ వారు నీరేజపత్రాంతరంబైన తోయంబు తీరంది కాలంబు
సైరించి నీయందె డెందంబులంజేర్చి మోక్షంబుసాధింతురో
తండ్రి శ్రీవేణుగోపాలబాలా నమస్తే నమస్తే నమః॥

మత్తకోకిల.

ఇత్తెఱంగునసామజాధిపు డెంతయున్గొనియాడుచున్
బత్తితోడరమాధినాధుని పాదపద్మములంబడన్
జిత్తమప్డుగరంగిగాగిట జేర్చి శ్రీహరియాదరా
యత్తవృత్తిని బల్కెనిట్లు సురాలియద్భుత మొందగన్॥

శా॥ ఓయీభాగవతాగ్రగణ్య వినుమీయుర్వీజను ల్నీకథన్
ధీయుక్తింబఠియించి నిత్యమభివృద్ధింగాంతురిష్టాలితో
సాయుజ్యంబు గొనంగనీకొసగితిన్ జాగేలలెమ్మా విమా
నాయత్తుండవుగమ్ము రమ్ము సుగుణాఢ్యా హస్తిరాజోత్తమా॥

పంచచామరము.

గజేంద్రునిం బ్రియాళితోడగాచి తోడుకొంచున
బ్జజాది దేవసంఘము ప్రశంసచేయుచుండవి
డ్వజుండు దేవితో వికుంఠ పట్టణంబు కెన్నుచో
వజొక్కి వెల్పు సానులెల్ల బాటపాడిరిట్టులన్॥

మంగళము — సురటి.

ప॥ గజరాజరక్షణ - కమలాయతేక్షణ ॥మంగళం॥
అ॥ విజయనగరపాల - వేణుగోపాలనీకు ॥మంగళం॥
౧॥ అజవందితనారా - యణదాసావన ॥మంగళం॥

కాఫీ—త్ర్యస్రగతి

ప॥ మంగళముత్తుంగమా - తంగరక్షకా । మంగళము దుష్టసంక్రమా
శిశిక్షకా

౧. నటశిరోమణీ విజయ - నగరపాలకా కుటిలాలకశాలిశ్రీ - గోప
బాలకా॥

౨. శారదేందుమందహాస - సర్వనాయకా । నారాయణ దాసహృదా -
నందదాయకా॥

క॥ గానకవితావధానని
ధానులగుమహాత్ములార దయతోగనుడీ
దీనిరచియించికృష్ణా
ధీనంబుగకృతినొసంగితిన్ మోక్షేచ్ఛన్॥

గజేంద్రమోక్షణము

సంపూర్ణము.